## భరతసార సంగ్రహము

పద్యరచన: మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయము వారి ప్రచురణ; సంపాదకులు: శ్రీ టి. వి. సుబ్బారావు; వెల 1-10-0.

పుస్తకం అట్టమీద "భరతసార సంగ్రహ"మనీ, లోపల "భరతశాస్త్ర పద్య కావ్య"మనీ అచ్చు వేశారు. ఇలా ఎందుకు చేయవలసి వచ్చిందో తెలియదు. గ్రంథకర్త: చిల్లకూరి దివాకర నారాయణదాసు.

సంపాదకులు పీఠికలో ఇలా వ్రాశారు: "ఖాండికయు నీ గ్రంథపరిమాణమును ఇందమర్పంబడిన విషయ వైవిధ్యమును బరిశీలించినచో రచయితకుగల సునిశితమైన లాక్షణిక దృష్టి విల్లడియగును. విషయ సంగ్రహమునకు దోషహైన స్పష్టతతో లక్షణగ్రంథమిది ముచ్చట గొల్పుచున్నది"—

ఈ గ్రంథముయొక్క విశిష్టతను సామాన్య పాఠకులు గ్రహించటానికి తగిన అవకాశాలను వేటినీ చేకూర్చకపోయినా, పై వాక్యాలనుబట్టీ సంపాదకులు ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గుర్తించినట్టే మనం ఊహించవలసి వుంది.

ఇది భరతశాస్త్రాన్ని గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాసువులకూ, భరత శాస్త్రాన్ని సాధన చేయదలచిన ప్రాథమికులకూ ఉపయోగించవలసిన గ్రంథం. కొట్టిన పిండిగా భరత శాస్త్రమంతా తుణ్ణం తుణ్ణంచేసి కూర్చున్నవారు ఈ గ్రంథాన్ని చదువవలసిన అవసరం లేదుకదా! అలాంటి సందర్భంలో భరతశాస్త్ర పరిచయంలేని ప్రాథమికులకు ఈ పద్యాలు అర్థమౌతాయా అనేది అనుమానాస్పదమైన విషయం. ఇది లక్షణ గ్రంథం. దీన్లో సాంకేతికమైన పదజాలం వాడబడింది. అందుచేత మామూలు మనిషికి అర్థంకావటం దుర్లభం. ఈ పద్యాలకు టీకగాని తాత్పర్యంగాని యిచ్చివుంటే బాగుండేది. సంపాదకులు అలాంటి శ్రమ తీసుకున్నారుగారు. గ్రంథస్థమైవున్న నాట్య సంప్రదాయాన్ని గురించిగాని, రచయిత ఎక్కడి వాడు, ఇలాంటి గ్రంథం రచించటానికి పూనుకోవటానికి ప్రయత్నించుటలో ఆయనకుగల పరమాశయమేమైవుంటుంది, ఇత్యాది విషయాలను అన్వేషించి, తగిన పీఠికను వెలయించటానికిగాని సంపాదకులు పూనుకున్నారుకారు. సంపాదకులుగా వీరు నిర్వహించిన కార్యభారమేమో మనకు బోధపడదు. పోనీ నిర్దుష్టంగా గ్రంథం అచ్చువేయించి అందజేశారా అంటే అదీ కనుపించదు. 68 పేజీల చిన్న గ్రంథానికి 8 పేజీల అచ్చు తప్పులపట్టికను వెలయించారు. అసలు, తెలుగు భాష యందు యేమాత్రం గౌరవంవున్నవాడికైనా ఇంకులో అచ్చయివున్న విధంగా ఈ పద్యాలు చదివితే చిరాకుపుడుతుంది! ఉదాహరణకు: ఈ దిగువ పద్యం ఎలా అచ్చువేయించారో చిత్తగించండి:

'శా. వాణీకాంచన గర్భరాణి మతిగీ
ర్వాణీఘన శ్రోణి స
ద్వీణాపుస్తక పాణిబంధురల స
ర్వేణీ పురాణీ శుకీ
వాణీవాదు విచిత్ర వర్తన కళా
నై చిత్రధాత్రీజన
శ్రేణుగ్గాంచి గణింపజేయవె నినున్
సేవించి ప్రార్థించెదన్.'

ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు ఈవిధంగా ఈ తెలుగు గ్రంథాలను అచ్చున వెలయింపజేయటానికి పూనుకోవటం శోచనీయం.

తె. సూరి.

## పంచామృతము

కావ్యసంపుటి; రచన: శ్రీమతి యం. ఆదిలక్ష్మి, ప్రాప్తిస్థానము: రచయిత్రి, 15 ముజఫర్ జంగ్ బహదూర్ వీధి, తిరువళిక్కేణి, మద్రాసు-5; వెల 1-8-0.

ఈ గ్రంథానికి శ్రీ విడుదవోలు వెంకటరావు గారు ఆరుపేజీల ఆముఖం వెలయించారు. కాని ఆ ఆముఖంలో ఈ గ్రంథంలోని కావ్యఖండికల గుణాగుణములను గురించి లేశమూ పరామర్శించారు కారు.

దధి, క్షీరము, ఘృతము, శర్కర, మధువు యీ అయిదును కలిసినది పంచామృతము. ఈ సంపుటిలో, తిమ్మక్క, లీలావతి, రుద్రమదేవి, మొల్ల, తరిగొండ వేంగమాంబ— ఈ అయిదుగురు విదుషీమణులనూ సంస్మరించుతూ అయిదు శీర్షికలలో పద్యరచన లున్నాయి. అందుచేత 'పంచామృతము' అన్న పేరు సార్థకం. ఆదిలక్ష్మిగారికి తెలుగు భాషపైన చక్కని అధికారం వున్నట్లు కనుపించుతుంది. ఒడిదుడుకులు లేని సరళమైన వాక్కు; రచన నిర్మలవాహినిగా సాగిపోతుంది. పద్య నిర్మాణంలో కూడా ప్రాచీనులలో గల ఒడుపులను కొన్నిటిని కైవసం చేసుకున్నారు. ఉదాహరణకు:

ఆకుది తమ కెంతని, పా
రాడగ దొరకొన్న పూరుషాధిపతుల్ చే
యాడక, కాలాడక, తల
లాడిపడన్ దగిరి పోరిలో రుద్రమచే.

కాని, కావ్యనిర్మాణానికి కేవల భాషాశక్తి, పద్య నిర్మాణశక్తీ మాత్రమే చాలవు. ఇవి నిజమైన కవితాశక్తికి అలంకారములు కాగలవేగాని యివే కావ్యంగా నిల్చలేవు. రసపుష్టి కావ్యానికి ప్రాణం. దానిని నిర్మించగలది ధ్వని. వీటిని సాధించుకోక పోతే రచయిత్రి కావ్యరంగంలో పైకి రాలేరు. కేవల వాచ్యం కావ్యంగా జీవించలేదు. కరుణరసాన్ని చిప్పిల చేయటానికి మహావకాశం గల లీలావతీ పరిణయం లాంటి కథావస్తువును సేకరించి కూడా, విజయం పొందలేక పోయారు.

కావ్యనిర్మాణం అసిధారావ్రతం. అది యెంతటి విపత్కరమైనా సరే, మనకు అభిలాష వున్న సంగతులన్నీ తోచిన చోటల్లా చెప్పివేయటానికి అనువుగాదు. తిమ్మక్క కావ్యమంతా అయినతరువాత శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని గురించిన చివరిపద్యం పైరచనలో సాధించిన రసిలేశాన్ని తుడిచి వేసేదిగావుంది.

మరొకటి: కేవల భావాభిమానం (Sentiment) ఈనాడు కావ్య నిర్మాణానికి చాలదు. కావ్య సాంకేతిక పరిజ్ఞానంతో పాటు, విస్తృతమైన వైజ్ఞానిక ప్రౌఢవాన్ని సంతరించు కుంటేనే గాని ఈనాడు యెవరూ కవితాపీఠాన్ని అలంకరించలేరు.

ఆదిలక్ష్మిగారి జన్మస్థానం ఆత్మకూరట; అంటే కవయిత్రి మొల్ల జన్మస్థానం. ఆ కారణంగా మొల్ల యెడల వీరికి సహజంగా అభిమానం. ఆ ఘట్టాన్ని కొంత ఉదాత్తంగానే నిర్వహించారు.

'కమ్మని లేలతెన్నుసుకి
కారముతో సరసార్థయుక్తితో
ముమ్మరమైన నీకవనము—'

ఇత్యాది పదబంధాలు కొన్ని ముచ్చటగా వున్నాయి.

## శ్రీ త్యాగరాజ చరిత్రము

పద్యకావ్యము: రచన: శ్రీ వల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు; ప్రాప్తిస్థానం: రచయిత, గోవిందరాజులపేట-విజయవాడ 2. వెల రు 1-0-0.

రచయితకు సంస్కృతాంధ్రముల యందూ, పద్యనిర్మాణమందూ అత్యంతమైన ప్రతిభాసంపత్తు లున్నాయి. భక్తిరసపూరితమైన ఈ రచన ప్రశంసాపాత్రంగా వుంది. త్యాగయ్య మధుర భావాలను వీరు పద్యములలోనికి సంతరించు కొన్న విధానం అద్భుతం.

బాలా! సుశీలా! హాటక
చేలా! సుజనపరిపాల! శ్రీ రమణీహృ
ల్లోలా! వీరవిద్యుతి విశిఖ
జాలా! దీప్తవనమాల! జలదనీలా!

"బాలకనకమయచేల" అన్న కృతిని ఆలా పైవిధంగా పోతపోశారు. ఇలా అనేకం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by
S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty
Street, Madras—1. Editor: S. Sambhu Prasad.